

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **తెలుగు భక్తి** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **తెలుగు భక్తి** వారి వెబ్ సైట్: http://www.telugubhakti.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## తెలుగు భక్తి వారి వెబ్ సైట్:

## http://www.telugubhakti.com/



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# వేమన శతకము

(టీకాతాత్పర్యసహితము)

వేమన 17 వ శతాబ్దికి చెందినవాడు విస్సన్న చెప్పిందే వేదమన్నట్లు వేమన చెప్పిందే నీతులు. వేమన పద్యము ఒకటైనను నోటికి రాని పామరుడైన లేడు. అతను చూడని తావు లేదు. అన్ని రంగములందు అతను కాలూని Jack of all trades లాగా అన్ని రంగముల గురించి అశువుగా నీతులు చెప్పాడు. వేమన అంటే తెలుగు నాట ఒక పెద్దన్నయ్యలాగా చిరపరచితుడుగా వుంటాడు. 'కామి గాక మోక్షగామి' కాడని చివరకు అతను ఒక యోగిగా రూపొందాడు. స్వర్ణ విద్యను కూడా సాధకం చేశాడన్న ప్రధవుంది.

1. చిత్త శుద్ధి కలిగి చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియుఁగొదువకాదు
విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత
విశ్వదాభిరామ వినురవేమ.

మనసు పెట్టి చేస్తే ఏ చిన్న పనైనా సత్ఫలితాలనిస్తుంది. మనసు దానిమీద లేకపోతే అది ఫలించదు. మర్రిచెట్టు విత్తనము ఎంతో చిన్నది అయినా ఎంతో పెద్ద చెట్టయి విస్తరిస్తుంది. దీపం చిన్నదైనా ఎంతో వెలుగునిస్తుంది. కాబట్టి ఏ పనైనా మనసారా చేయమని భావము.

2. ఆత్మశుద్ధి లేని యాచారమదియేల?
భాండశుద్ధి లేని పాకమేల?
చిత్త శుద్ధి లేని శివపూజలేలరా?
విశ్వదాభిరామ వినురవేమ.

ఆచారాలు అంటూ గంతులు వేసే పెద్దలందరూ వినండి ఆచారాలు మూఢ నమ్మకాలుకాకూడదు. కుండ సరిగా లేకపోతే వంట రుచిగా రాదు. మనసు శుచిగా లేకపోతేనువ్వు పట్టువస్త్రము కట్టుకొని, దురాలోచన చేస్తూ, ఇతరులకు కీడు తలపెడుతూ, శివుని మీద పూలు వేస్తే, శివుడు నీకు మంచి ఫలితము నిస్తాడా? (ఈయడని భావము).

3. గంగిగోవుపాలు గంటెడైనను చాలు
కడివెడైననేమి ఖరముపాలు
భక్తికలుగు కూడు పట్టెడైననుజాలు,
విశ్వదాభిరామ వినురవేమ.

మనసుంచి చేసిన వంట, పెట్టిన భోజనము సంతృప్తినిస్తుంది తప్ప, వేలాది రూపా యలు ఖర్చు పెట్టి, వేలం వెర్రిగా విందొనరించామని, వచ్చినవారి అజ కనుక్కోకపోతే అది తృప్తినిస్తుందా! కడవ నిండా గాడిద పాలున్నా, మంచి గోక్షీరము రుచి దాని కొస్తుందా !

4. నిక్కమైన మంచినీలమొక్కటిచాలు
దళుకు బెళుకు రాళ్ళు తట్టెడేల
చాటుపద్యమిలను చాలదా యొక్కటి?
విశ్వదాభిరామ వినురవేమ.

జాతిరత్నమొక్క దాని విలువ పూత మెరుగు రాళ్ళకు రాదు. వేలాది పనికిరాని కవి తల కన్న మంచి నీతిగల చాటు పద్యమొక్కటి చాలు అని తన పద్యముల విలువ చెప్పకనే చెప్పకున్నాడు వేమన.

5. మిరపగింజచూడ మీద నల్లగనుండుఁ
గొరికిచూడ లోనఁజురుకు మనును
సజ్జనులగువారి సారమిట్లుండురా!
విశ్వదాభిరామ వినురవేమ.

దీపము యొక్క కాంతి చాల దూరము ప్రసరించినట్లే సజ్జనుల యొక్క ప్రభావము చాల దూరము పోవును. మిరపకాయ పైన నల్లగ నున్నను కారము ఎంత చురు క్కు మనునో సజ్జనుల ప్రభావము దుర్జనులను కూడ మార్చును.

6. మృగమదంబుఁజూడ మీద నల్లగనుండు
బరిఢవిల్లు దాని పరిమళంబు
గురువులైనవారి గుణములీలాగురా!

విశ్వదాభిరామ వినురవేమ.

కస్తూరి రంగు నల్లగనున్నను దాని పరిమళము ఎంత మిన్ననో మంచివారి గుణము లు ప్రజలు తలచుకొని మురిసిపోని రోజుండదు.

7. మేడిపండుచుడ మేలిమై యుండు
పొట్టవిప్పిచూడఁబురుగులుండు
పిరికివాని మదిని బింకమీలాగురా
విశ్వదాభిరామ వినురవేమ.

చెడ్డవాడు పైకి మంచిగా కనుపించినప్పటికీ వానిచెడ్డగుణములు కీడునే కలిగించు ను. అది ఎట్లనగా మేడిపండులో పురుగులుంటే అవి పనికిరావు కదా !

8. నేరనన్నవాఁడు నెరజాణ మహిలోన
నేరునన్నవాఁడు నిందజెందు
ఊరుకున్నవాఁడె యుత్తమయోగిరా!
విశ్వదాభిరామ వినురవేమ.

అన్ని తెలుసు అని అహంభావముతో ప్రవర్తించువాడు నిందల పాలగును. ఏమీ తెలి యదని తెలుసుకో గోరినవాడు మౌనముతో అన్నియు తెలుసుకొనువాడు నీతిమం తుడు.

9. గంగ పారునెపుఁడు గదలని గతితోడ
మురికివాగు పారు మ్రోతతోడ
పెద్దపిన్నతనము పేర్మియీలాగురా,
విశ్వదాభిరామ వినురవేమ.

అల్పులు, దుష్టులు ఆవేశముతో, దుడుకు తనముతో, తొందరపాటుతో మెలగుతారు. పెద్దవారు, మంచివారు, సజ్జనులు నిండుకుండ తొణకనట్లు నిండుగా,హుందాగా

వర్తిస్తారు.అది ఎట్లనగా గంగానది, గతి తప్పక హుందాగా ప్రవహిస్తే, మురుగుకాలవ కలుషితమయిన నీటితో, దోమలు ఈగల మోతతో, దుర్వాసనతో రోగాలు వ్యాప్తిచెందించినట్లు.

10. నిండునదులు పారు నిలచిగంభీరమై
వెఱ్ఱివాగు పాఱు వేగఁబొర్లి
అల్పుడాడురీతి నధికుండు నాడునా?
విశ్వదాభిరామ వినురవేమ.

అల్పజ్ఞుడు ఆవేశముతో అన్ని పనులను చెడగొట్టునటుల, సెలయేరు ఒడిదుడుకలతో ప్రవహించి అన్నింటిని ధ్వంస మొనర్చినట్లే, వివేకవంతులు నిండునదులవలె నీతి బోధలొనర్చి, పనులు సఫలము చేయుదురు.

11. అల్పుడెపుడు పల్కు నాడంబరముగాను
సజ్జనుండుఁబల్కుఁజల్లగాను
కంచుమ్రోగునట్లు కనకంబు మ్రోగునా
విశ్వదాభిరామ వినురవేమ.

బంగారపు శబ్దము కంచు శబ్దముకైన తక్కువైనట్లే మంచివారి మాటలు చల్లగాను నీతియుతంగాను వుండి మంచినే పెంపొందిస్తాయి. నీచులకు వాగాడంబరం ఎక్కువ.

12. కులములోన నొకఁడు గుణవంతుడుండిన
కులము వెలయు వాని గుణముచేత
వెలయు వనములోన మలయజంబున్నట్లు
విశ్వదాభిరామ వినురవేమ.

ఒక్క రాముని వలన ఇక్ష్వాకు వంశ ప్రతిష్ట ఇనుమడించినట్లుగా, ఒక్క గంధపు చెట్టు వలన అరణ్యమునంతకు సువాసన వచ్చినట్లు ఒక్క గుణవంతుని వలన వంశ మునకంతకు మంచిపేరు వచ్చును.

13. పూజకన్న నెంచ బుద్ధిప్రధానంబు
మాటకన్న నెంచ మనసు దృఢము
కులముకన్న మిగులు గుణము ప్రధానంబు,
విశ్వదాభిరామ వినురవేమ.

బుద్ధి నిలకడగా వున్న పూజ, నిలబెట్టుకొనిన మాట పేరు తెచ్చినట్లే మంచిగుణము, కులమేదైనను పేరుగాంచును. కుమ్మరివాడైన కురువరతి నంబి ప్రసిద్ధి చెందిన భక్తుడవలేదా !

14. ఉత్తముని కడుపున నోగు జన్మించిన
వాఁడుచెఱచు వాని వంశమెల్లఁ
జెఱకు వెన్నుపుట్టి చెరపదా తీపెల్ల?
విశ్వదాభిరామ వినురవేమ.

చెరకుగడ చివరవెన్ను పుట్టిన తియ్యదనము కోల్పోయినట్లే మంచివాని కడుపున నీచుడు పుట్టిన వంశ ప్రతిష్టను పాడుగావించును.

15. కులములోన నొకడు గుణహీనుడుండినఁ
కులముచెడును వాని గుణమువలన
వెలయుఁజెఱకునందు వెనువెడలినట్లు
విశ్వదాభిరామ వినురవేమ.

వెన్ను వల్ల చెరకుగడ తియ్యదనము కోల్పోయినట్లే కులములో ఒక నీచుడు పుట్టినచో వంశ గౌరవమును నాశమొనర్చును.

16. రాముడొకడుపుట్టి రవికుల మీడేర్చె
కురుపతి జనియించి కులముఁజెఱచె
ఇలను బుణ్యపాప మీలాగు కాదొకా
విశ్వదాభిరామ వినురవేమ.

శ్రీ రాముడు రఘు వంశమునకు ఖ్యాతి తెచ్చాడు. కాని దుర్యోధనుడు వల్ల కురువం శంనాశనమైపోయింది. ఇలలో పాప పుణ్యములు ఈ విధముగా వుండునని వీరు నిరూపించారు.

17. హీన గుణమువాని నిలుసేర నిచ్చిన
ఎంతవానికైన నిడుము గలుగు
ఈగ కడుపుఁజొచ్చి యిట్టట్టు సేయదా?
విశ్వదాభిరామ వినురవేమ.

ఈగ కడుపులో చేరిన అతలాకుతలమైనట్లే నీచునితో సావాసమెనర్చిన వారు కింద మీదగుదురు.

18. వేరుపురుగుచేరి వృక్షంబుజెఱచును
చీడ పురుగు జేరి చెట్టుఁజెఱచుఁ
కుత్సితుండుచేరి గుణవంతుఁజెఱచురా
విశ్వదాభిరామ వినురవేమ.

చెడ్డగుణము కలిగిన వారికి ఆశ్రయమిచ్చినవారే, పురుగుకు ఆశ్రయమిచ్చిన చెట్టు మూలచ్ఛేదమగునట్లు, నాశనము పొందుదురు.

19. అల్పుడెన్ని విద్యలభ్యసించిన గాని
ఘనుఁడుగాడు హీన జనుఁడెగాని
పరిమళముల మోయ గార్ధభము గజమౌనె
విశ్వదాభిరామ వినురవేమ.

గంధములు మోయు గాడిదకు సువాసన రానట్లే విద్యలెన్ని నేర్చినను నీచుడు సుజ నుడు కాలేడు.

20. విద్యలేనివాడు విద్యాధికుల చెంత
నుండినంత పండితుండుకాడు
కొలని హంసలకడం గొక్కెర యున్నట్టు!

విశ్వదాభిరామ వినురవేమ.

కొలనులో హంసల నడుమ కొంగ యున్నను దాని జాతిబేధము గుర్తింపబడినట్లే విద్యాధికుల మధ్య అవివేకి యున్నను వానికి వివేకము కల్గదు.

21. అల్పజాతి వాని కధికారమిచ్చిన
దొడ్డవారినెల్ల దొలగఁజేయు
జెప్పుందినెడుకుక్క చెఱకుతీపెరుగునా?
విశ్వదాభిరామ వినురవేమ.

చెప్పులు తినే కుక్క చెరకు తియ్యదనము తెలిసికోలేనట్లు, గొప్పవారి గొప్పగుణము లను నీచుడు తెలిసికోలేక అధికారము కలిగిన వారినందరిని వెడలగొట్టును.

22. అల్పుడైనవాని కధిక భాగ్యముగల్గ
దొడ్డవారి దిట్టి తోలఁగొట్టు
అల్పజాతి మొప్పె యధికుల నెరుగునా:
విశ్వదాభిరామ వినురవేమ.

గడ్డికుప్పను కుక్కను కావలి కాయుమన్న గడ్డి తనకు పనికిరాకున్నను, అవసరమైన ఆవునైన దగ్గరికి రానీయదు. నీచునకు అధికారము కల్గిన సుజనులను దగ్గరికి రానీయడు.

23. ఎద్దుకైనగాని యేడాది తెలిసిన
మాటఁదెలిసి నడుచు మర్మమెరిగి
మొప్పె తెలియలేడు ముప్పదేండ్లకునైన,
విశ్వదాభిరామ వినురవేమ.

జంతువైనను శిక్షణ కల్గిన మనసెరిగి మసలుకొనును. మూర్ఖుడు ఎంత శిక్షణ నొసగినను తెలియనితనమును పోగొట్టుకొనలేడు.

24. ఎలుకతోలుఁదెచ్చి యేడాది వుతికిన
నలుపు నలుపేగాని తెలుపురాదు
కొయ్యబొమ్మ దెచ్చి కొట్టినఁబలుకునా
విశ్వదాభిరామ వినురవేమ.

ఎలుక తోలును ఎంత ఉతికిన తెలుపు అవదు. మానవ స్వభావ సిద్ధములగు గుణ ములను ఎంత ప్రయత్నము చేసినను మార్చలేము. అది ప్రాణములేని కొయ్యబొమ్మ ను మాటలాడుమన్నట్లుంటుంది,

25. పాముకన్న లేదు పాపిష్టిజీవంబు
అట్టిపాము చెప్పినట్లు వినును
ఖలుని గుణము మాన్ప ఘనులెవ్వరునులేరు
విశ్వదాభిరామ వినురవేమ.

దుర్మార్గుడి దుర్లక్షణాలను మానిపించి సజ్జనుడుగా చేయుట చాల కష్టము. అనితర సాధ్యము.

26. వేము పాలువోసి ప్రేమతో బెంచిన
చేదువిరిగి తీపిఁజెందబోదు
ఓగునోగెగాక యుచితజ్ఞు డెటులౌను?
విశ్వదాభిరామ వినురవేమ.

వేప చెట్టుకు పాలు పోసి పెంచినను తియ్యదనము రానట్లే, నీచునకు ఎన్ని నీతులు నూరిపోసినను సజ్జనుడు కాలేడు. అటువంటి నీచుని చెలిమి మనకు కూడ హాని కల్గించును.

27. ముష్టి వేపచెట్టు మొదలంట ప్రజలకు
బరగ మూలికలకు బనికివచ్చు
నిర్ణయాత్మకుండు నీచుడెందులకౌను
విశ్వదాభిరామ వినురవేమ.

ఎంతో చేదు వృక్షములైన వేప, ముషిణి చెట్లు సైతము మందుల తయారీలో వుపయోగపడును. క్రూరాత్ముడైన మానవుడు ఎవరికి వుపయోగపడగలడు?

28. పాలు పంచదార పాపర పండ్లలోఁ
చాలబోసి వండఁచవికి రాదు
కుటిల మానవులకు గుణమేలు గల్గురా
విశ్వదాభిరామ వినురవేమ.

చేదుగావుండే పాపరపండ్లలో పాలు పంచదార వేసి వండితే తీయదనము రాదు కదా! అలాగే వంకర బుద్ధిగల నీచులకు ఎన్ని గుణములు కలిపిననూ బుద్ధిరాదు.

29. పాల నీడిగింటఁగ్రోలుచునుండెనా
మనుజులెల్లఁగూడి మద్యమండ్రు
నిలువఁదగనిచోట నిలువ నిందలువచ్చు
విశ్వదాభిరామ వినురవేమ.

నిలువదగని చోట నిలిచి మంచి పని చేసిననూ అది చెడ్డపనే అని అన్పించుకొనును. అది ఎట్లన కల్లు అమ్మేవాని ఇంట్లో పాలు తాగినట్లు. ఇటువంటి పద్యమే సుమతీ శతకంలో కూడా కన్పిస్తుంది. శతకకర్తల భావముల సారూప్యము విదితము.

30. కాని వానితోడఁ గలసి మెలఁగుచున్న
గానివానివలెనె కాంతురవని
తాడిక్రిందఁబాలు త్రాగిన చందమౌ
విశ్వదాభిరామ వినురవేమ.

యోగ్యతలేని వారితో చెలిమి నిన్ను కూడా అయోగ్యునే చేస్తుంది. తాడి చెట్టుక్రింద నిలబడి పాలుత్రాగినను కల్లుత్రాగినట్లే అని అందురు.

31. తామసించి చేయతగఁ దెట్టి కార్యంబు

వేగిరింప నదియు విషమెయగును
పచ్చికాయదెచ్చి బడవేయ ఫలమౌనె?
విశ్వదాభిరామ వినురవేమ.

పచ్చికాయ వేగిరపడి ఆరగించినను పండుగానట్టే, మిగుల పండినను, కుళ్ళినను పనికిరాదు. అలాగే సమయమునకు ముందుగాని మరీ వేళ తప్పిగాని ఏ పనిని చేయకూడదు. వేళ ఎరిగి పని చేయువాడే నిపుణుడు.

32. కోపమునను ఘనత కొంచమైపోవును
కోపమునను మిగుల఼ గోడు గల్గు
కోపమడచనేని కోర్కెలీడేరు
విశ్వదాభిరామ వినురవేమ.

తన కోపమే తనకు శత్రువు. తన శాంతమే తనకు రక్ష. కావున సమయమెరిగి పని చేయువాడే నేర్పరి.

33. నీళ్ళలోన మొసలి నిగిడి యేను఼గు బట్టు
బయట గుక్కచేత భంగపడును
స్థానబలముగాని తన బలిమికాదయా
విశ్వదాభిరామ వినురవేమ.

34 నీళ్ళలోన మీను నిగిడి దూరముపారు
బయట మూరెడైన బారలేదు
స్థానబలిమిగాని తన బలిమికాదయా
విశ్వదాభిరామ వినురవేమ.

35. నీళ్ళమీదనోడ నిగిడి తిన్నగ఼బ్రాకు
బయట మూరడైన బారలేదు
నెలవు దప్పుచోట నేర్పరి కొరగాడు
విశ్వదాభిరామ వినురవేమ.

ఎంత వీర్యవంతుడైనను తన చోటుకాని చోట ఓడిపోవును. నీళ్ళలోని మొసలి ఏనుగునైనను పట్టును. బయట కుక్కయైనను మొసలిని ఓడించును. నెలవులు కాని చోట బలమొక్కటే చాలదు. ఎంతటి ప్రజ్ఞావంతుడైనను పరస్థలములందు రాణింపలేడు. 'స్థాన బలిమి' కున్న ప్రాముఖ్యము ఇంతింతనరానిది. పరమ శివుని మెడలో వుంటే పాము కూడా తన శత్రువైన గరుత్మంతుని కుశలమడుగుతుంది. ఆ స్థానంలో లేకపోతే పరుగులిడుతుంది.

.

36. కులములేనివాడు కలిమిచే వెలయును
కలిమి లేనివాడు కులము దిగును
కులముకన్న భువిని గలిమియెక్కువసుమీ
విశ్వదాభిరామ వినురవేమ.

37. కులము గలుగువాఁడు గోత్రంబు గలవాఁడు
విద్యచేత విఱ్ఱవీగువాడు
పసిడి గలుగువాని బానిసకొడుకులు!
విశ్వదాభిరామ వినురవేమ.

సంపదయున్న కులము, గోత్రము, వంశ గౌరవము, విద్యాధిక్యత ఇవన్నియు తృణప్రాయములే. ఏమనిన ఇవన్నియు ధనవంతుని ఆశ్రయింప వలసినదే.

38. కనియు గానలేడు, కదలఁప డానోరు
వినియు వినగలేడు విస్మయమమున
సంపద తలవాని సన్నిపాతం బిది,
విశ్వదాభిరామ వినురవేమ.

సంపద కలవారిలో కొంతమంది రోగులు (సంపద అనే గర్వము తలకెక్కినవారు) చూచి, విని కూడ, మధురముగా మాట్లాడిననూ లోక ధర్మవులు గ్రహింపకుందురు.

39. ఏమిగొంచువచ్చె నేమి తాంగొనిపోవుఁ

బుట్టువేళ నరుడు గిట్టువేళ
ధనము లెచటికేగుఁదానెచ్చటికినేగు
విశ్వదాభిరామ వినురవేమ.

40. తనువ దెవరిసొమ్ము తనదని పోషింప
ద్రవ్య మెవరిసొమ్ముదాచుకొనగ
బ్రాణ మెవరిసొమ్ము పారిపోవక నిల్వ
విశ్వదాభిరామ వినురవేమ.

సంపదయంతయు శాశ్వతమని, దైవము లేడని, కనపడేదంతా తన ప్రజ్ఞేనని నమ్మే వాడు తానేమియు తీసుకురాలేడని, తీసుకుపోలేడని, ప్రాణము అశాశ్వతమని ఎరుగనివాడు

41. గొడ్డుటావు బితుక గుండఁగొంపోయిన
పండ్లురాలఁదన్ను బాలవిదు
లోభివాని నడుగ లాభంబు లేదయా
విశ్వదాభిరామ వినురవేమ.

42. మేక కుతుక బట్టి మెడచన్ను గుడువగా
ఆకలేల మాను నాశగాక
లోభివాని నడుగ లాభంబు లేదయా
విశ్వదాభిరామ వినురవేమ.

పిసినారిని ధనమడుగ బూనుట పాలీయని ఆవువద్దకు వెళ్ళితన్నులు తినుట వంటిది. మేక మెడ చన్నులను పితుకుటవంటిది. ప్రయోజనశూన్యములయిన పనులను విజ్ఞుడుచేయడు.

43. పెట్టిపోయలేని వట్టినరులు భూమి
బుట్టనేమి వారు గిట్టనేమి
పుట్టలోనఁజెదలు పుట్టవా? గిట్టవా?

విశ్వదాభిరామ వినురవేమ.

పుట్టలోని చెదలు పుట్టా చచ్చినా లాభంలేనట్లే మంచిగుణములు (దాతృత్వము మొ॥నవి) లేని మానవుడు ప్రయోజనశూన్యుడు.

44. ఆశచేత మనుజు లాయువు గలనాళ్ళు
తిరుగుచుండ్రు భ్రమను(ద్రిప్పలేక
మురికికుండమందు ముసరునీగల భంగి
విశ్వదాభిరామ వినురవేమ.

ఈ శరీరము శాశ్వతమను భ్రమతో పరమార్థమరయగ లేని వాడు బదికినను చచ్చినను ఒకటే.

45. నీళ్ళలోన మీను నెరమాంస మాశించి
గాలమందు (జిక్కు కరణి భువిని
ఆశదగిలి నరుడు నాలాగు చెడిపోవు
విశ్వదాభిరామ వినురవేమ.

46. ఆశ పాపజాతి యన్నింటికంటెను
ఆసచేత యతులు మోసపోరె
చూచి విడుచువారె శుద్ధాత్ములెందైన
విశ్వదాభిరామ వినురవేమ.

ఆశా పాశమునకు లోనయినవారు పరమాత్మపైన ధ్యాస నిలుపలేరు. ఐహిక భోగ భాగ్యములపైననే వారి ధ్యాస.

47. అన్నిదానములను నన్నదానమె గొప్ప
కన్నతల్లికంటె ఘనములేదు
ఎన్నగురునికన్న నెక్కుడు లేదయా
విశ్వదాభిరామ వినురవేమ.

దానములలో అన్నదానము, తల్లిని మించిన దైవము, జ్ఞానప్రదాత అయిన సద్గురువు కంటె గొప్పవిలేవు.

48. ఆశకోసివేసి యనలంబుచల్లార్చి
గోచిబిగియగట్టి గుట్టుదెలిసి
నిలిచినట్టివాడె నెఱయోగియెందైన
విశ్వదాభిరామ వినురవేమ.

పరిపూర్ణుడయిన యోగి అరిషడ్వర్గములను జయించినవాడే.

49. కనకమృగము భువిని గద్దు లే దనకయె
తరుణి విడిచి చనియె దాశరథియుఁ
దెలివి లేనివాడు దేవడెట్లాయెరా
విశ్వదాభిరామ వినురవేమ.

భార్య కోరినదని మంచి చెడు విచారింపక మాయలేడి వెంట పరుగులిడిన రాముడు దేవుడెలాగయాడు.

50. చచ్చిపడిన పశువు చర్మంబు కండలు
పట్టిపెరకి తినును బరగ గ్రద్ద
గ్రద్దవంటివాడు గజపతి కాడొకో
విశ్వదాభిరామ వినురవేమ.

దుర్మార్గుడయిన రాజు చచ్చిపడియున్న శవములను తిను గ్రద్దవంటివాడు.

51. అలను బుగ్గ పుట్టినప్పుడే క్షయమౌను
కలనుం గాంచులక్ష్మి కల్లయగును
ఇలను భోగ భాగ్య మీతీరు కాదొకో
విశ్వదాభిరామ వినురవేమ.

ఇలలో కలిమి లేములు అలలతో కూడిన నీటి బుడగలు వంటివి. కలయందు కన్పిం చుసంపదవంటివి. అజ్ఞానియే వీటిని స్థిరమని తలచును.

52. కోతి నొకటిదెచ్చి క్రొత్తపుట్టముగట్టి
కొండ్రముచ్చులెల్లఁ గొలిచినట్లు
నీతిహీనునొద్ద నిర్భాగ్యులుందురు
విశ్వదాభిరామ వినురవేమ.

చెడ్డవారి దగ్గర చెడ్డవారే చేరుదురు. నీతిమంతులు వారి వద్దకు పోరు.

53. కల్లలాడువాని గ్రామకర్త యెఱుగు
సత్య మాడువాని స్వామి యెఱుగు
బెద్దతిండిపోతుఁ బెండ్లామెఱుంగురా
విశ్వదాభిరామ వినురవేమ.

విశ్వమంతా వ్యాపించిన వాడా ఓ రామచంద్రా ! అబద్దములాడు వారిని వారి స్నేహి తులు గ్రహించిన చందంగా నిజమును నీవొక్కడవే గ్రహించగలవు. భార్య యొక్కతే భర్త యొక్క భోజనపు తీరును గ్రహించి తగిన భోజనము పెట్టగలదు.

54. కల్ల నిజములెల్ల గరళకంఠు డెరుగు
నీరు పల్లమెరుగు నిజముగాను
తల్లితానెరుగును తనయుని జన్మంబు
విశ్వదాభిరామ వినురవేమ.

తన కొడుకు పుట్టుక గూర్చి తల్లికే తెలియును. నీరు ఎగువకు పారదు. పల్లమునకే పారును. నిజానిజములను గూర్చి పరమ శివునకు తప్ప ఎవరికి తెలియును.

56. ఉప్పులేని కూర యొప్పదు రుచులకు
పప్పులేని తిండి ఫలములేదు
అప్పులేనివాడె యధిక సంపన్నుడు

విశ్వదాభిరామ వినురవేమ.

55. మైలకోకతోడ మాసిన తలతోడ
నొడలు మురికి తోడ నుండెనేని
నగ్రకులజుడైన నట్టిట్టు పిలువరు
విశ్వదాభిరామ వినురవేమ.

వేష భాషలకున్న ప్రాముఖ్యము ఈ పద్యమునందు వర్ణింపబడెను. ఎంత వున్నత వంశంలో పుట్టినా మాసిన విలువలు, మాసిన జుట్టు కలిగి, స్నానపానములు లేని వ్యక్తిని ఎవరును గౌరవింపరు. ఆ కాలములో అప్పులేని వాడే అధిక ధనవంతుడని వేమన చెప్పినా ఈ రోజుల్లో ఎంత అప్పవుంటేనే అంత దనవంతుడని నానుడి వచ్చింది. ఉప్పులేని కూర రుచించదు పప్పులేని కూడు బలమునియ్యదు. అప్పజేసినా ధనము సంపాదించ కల్గిన వాడే ధనవంతుడని ఇప్పడు పద్యము మార్చుకోవాలి.

57. చెట్టుపాలు జనులు చేదందు రిలలోన
నెనుపగొడ్డు పాలవెంత హితము
పదురాడుమాట పాటియై ధర జెల్లు
విశ్వదాభిరామ వినురవేమ.

'పదుగురాడు మాట పాటియై ధరజెల్లు' అది న్యాయమా, అన్యాయమా, సత్యమా, అసత్యమా అది ఎవరును విచారింపరు. పదిమంది మంచిదన్న అదిమంచిది అని నమ్మి ఆచరించెదరు.

58. పట్టుపట్టరాదు పట్టి విడువరాదు
పట్టెనేని బిగియఁ బిట్టవలెను
పట్టిడుడచుకన్న బడి చచ్చుటయెమేలు
విశ్వదాభిరామ వినురవేమ.

ఏ విషయములోనైనా పట్టుదల పట్టిన అంతము వరకు దానిని నిలుపుకొనే తీరవలెను.అలాగాక దానిని మధ్యలో వదలి వేయువారు మూఢులు. ఇదే రీతిని భర్భహరి నీ

తి శతకంలోనూ సుమతీశతకంలోను కూడ పట్టుదల విషయంలో పద్యాలు వున్నవి. శతకకర్తలు ఈ భావంలో ఏకీభవించారనుకోవాలి.

59. తప్పులెన్నువారు తండోప తండంబు
లుర్విజనులకెల్ల నుండు దప్పు
తప్పులెన్నువారు తమతప్పులెరుగరు
విశ్వదాభిరామ వినురవేమ.

ఒక వేలు ఒరుల వైపు, చూపి తప్పు లెన్నువారు తమలోని తప్పులెరుగలేరు. మూడు వేళ్ళు తమవేపే వుంటాయన్న నిజాన్ని కూడా వారు చూడలేరు. మేమంతా అలాంటి మూఢులమే అని వేమన రామునికి విన్నవించుకుంటాడు.

60. అనగ ననగ రాగ మతిశయిల్లుచునుండు
దినదినగ వేము తియ్యగనుండు
సాధనమునపనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ వినురవేమ.

అన్న విధంగా ఈ శతకకారుడు కూడా 'సాధనమున పనులు సమకూరు ధరలోన' అని అన్నాడు. పాడగా, పాడగా గొంతు సాగినట్లే, తినగా తినగా చేదు తియ్యనైనట్లే, కష్టపడితే సాధించలేని పనులు లేవు. దృఢసంకల్పమున్నప్పుడే, ఏ పనైనా చేసి తీరా లన్న పూనికవున్నప్పుడే, అది సమకూరుతుంది.

61. తనకుగల్గు పెక్కు తప్పులునుండగా
ఓగు నేరమెంచు నొరులంగాంచి
చక్కిలంబుగాంచి జంతిక నగినట్లు
విశ్వదాభిరామ వినురవేమ.

నీచుడు ఎంతసేపూ ఎదుటివారి తప్పులు కనుగొనుటకే చూచును తప్ప తన తప్పులు తెలిసికోలేడు. తన లోపములెరిగిన వాడే ధీమంతుడు.

62. ఇనుము విరిగెనేని యినుమారు ముమ్మారు
కాల్చి యతుకవచ్చు క్రమముగాను
మనసు విరిగెనేని మరికూర్ప వచ్చునా
విశ్వదాభిరామ వినురవేమ.

ఎదుటివారి మనసు నొప్పించుట ఎవరికిని భావ్యము కాదు. ఒకసారి ఒకరిపట్ల మనసు నొచ్చుకొనెనా అది సరిచేయుట బ్రహ్మకైననూ సాధ్యముకాదు. అదే ఇనుపవస్తువైతే తిరిగి అతకవచ్చు. అందుకే మాటలాడునపుడు ఆచి తూచి మాటలాడవలెను. మాట పరుషమైన మనసు ఎంత మంచిదైనను మన్నన పొందలేడు.

63. ఒరుని జెఱచెదమని యుల్లమందెంతురు
తమకు జేఱురుగని ధరణి నరులు
తమ్ముఁ జెఱచువాడు దైవంబులేడొకో
విశ్వదాభిరామ వినురవేమ.

అజ్ఞానులు ఎపుడు ఎదుటివారికి కీడు చేయుటకే తలచెదరు. తమకు కూడ కీడు కల్గజేయుటకు దైవమున్నాడని ఎరుగరు. ఒకనికి ఒక కన్ను పోవలెనని కోరిన మనకు రెండు కళ్ళూ పోవునని ఎరుగనివాడే మూర్ఖుడు.

64. కానివానిచేత గాసు వీసంబిచ్చి
వెంట దిరుగువాడె వెఱ్ఱివాడు
పిల్లి తిన్న కోడి బిలిచిన పలుకునా
విశ్వదాభిరామ వినురవేమ.

65. మాటలాడనేర్చి మనసు రంజిలజేసి
పరగఁబ్రియముచెప్పి బడలకున్న
నొకరిచేత సొమ్ములూరక వచ్చునా
విశ్వదాభిరామ వినురవేమ.

దైవమునకైనను స్తోత్రములు చెప్పనిదే వరములు రావు. మానినులకైనను మంచి

మాటలు చెప్పనిదే మనసివ్వరు. ఎదుటివారి నుంచి నీకేదైనా కావలెనన్న మంచి మాటలే మార్గము. మాట పొందిక లేకున్నా కానీకి కొరగాడు.

66. చంపదగినయట్టి శత్రువు తనచేతఁ
జిక్కెనేని గీడు సేయరాదు
పొసఁగ మేలుచేసి పొమ్మనుటే చాలు
విశ్వదాభిరామ వినురవేమ.

చంపదగిన శత్రువు చేతికి చిక్కినా ఉపకారము చేయుటయే మేలు. తన యంతటతాను ఇంటికి వచ్చిన శత్రువునైనను ఆదరించుటలోనే నీ గొప్పతనము కన పడును.

67. వాన కురియకున్న వచ్చును క్షామంబు
వాన కురిసెనేవి వరదపారు
వరద కరవు రెండు వరసతో నెఱుగుడీ
విశ్వదాభిరామ వినురవేమ.

దేనికీ అతి పనికిరాదు. వానలు కురియకున్నను ఎక్కువ కురిసిననూ కరువే. సమముగా మితముగా వున్నపుడే సుఖసంతోషములు వెల్లివిరియును.

68. పుట్టిన జనులెల్ల భూమిలో నుండిన
బుట్టునా జగంబు పట్లదెపుడు
యముని లెక్కరీతి నరుగుచు నుందురు
విశ్వదాభిరామ వినురవేమ.

పుట్టిన వారందరూ స్థిరముగా నిలచిన భూమియందు చోటు చాలదు. అందుకే యముడు ఆయువు నిండిన వారిని కొనిపోవుచుండును.

69. వాన రాకడయును బ్రాణంబు పోకడ
కానబడ వెంత ఘనునకైన

గానఁబడినమీద గలియెట్లునడుచురా
విశ్వదాభిరామ వినురవేమ.

భూత, భవిష్యత్, వర్తమానములు తెలిసిన మనిషి భగవంతుడే అగునుకదా ! అటు వంటపుడు ఇది కలియుగ మేలాగవుతుంది.

70. చిప్పబడ్డ స్వాతిచినుకు ముత్యంబాయె
నీటిబడ్డ చినుకు నీటగలిసె
బ్రాప్తికలుగుచోట ఫలమేల తప్పురా
విశ్వదాభిరామ వినురవేమ.

లభించిన చోటును పట్టి మన సుఖ దుఃఖములు కల్గును. వాన చినుకు ముత్యపు చిప్పలోబడిన ముత్యమగునట్లే మనకు రాజాశ్రయము దొరకిన ప్రకాశించెదము.

71. ఎన్నిచోట్ల తిరిగి యేపాటు పడినను
అంటనీయక శని వెంటదిరుగు
భూమి క్రొత్తదైన భోక్తలు క్రొత్తలా
విశ్వదాభిరామ వినురవేమ.

ఏలిన నాటి శని పట్టినపుడు ఎన్ని చోట్ల తిరిగినను దుఃఖములు తప్పవు. తన కర్మా నుభవము ఎక్కడ పోయినా పట్టి పీడిస్తుంది.

72. కర్మమెప్పుడైన గడచిపోవగరాదు
ధర్మరాజు దెచ్చి తగనిచోట
గంకుభట్టుజేసెఁ గటకటా దైవంబు!
విశ్వదాభిరామ వినురవేమ.

కర్మానుభవము ఒక్కోసారి హీనుల దగ్గర కూడ ఒదిగియుండునట్లు చేయును. ధర్మరాజు విరాటుని దగ్గర కంకుభట్టుగా వున్నట్లు.

73. అనువుగానిచోట నధికుల మనరాదు
కొంచమైన నదియుఁ గొదువగాదు
కొండ యద్ధమందుఁ గొంచెమైయుండదా!
విశ్వదాభిరామ వినురవేమ.

పెద్దకొండ కూడ అద్దమందు ప్రతిబింబములో చిన్నదిగా కనిపించినా దాని గొప్పదన ముతగ్గనట్లే మనుజుడు కానిచోట్ల అహంకరింపగూడదు.

74. ఇమ్ము దప్పువేళ నెమ్మెలన్నియుమాని
కాలమొక్కరీలతి గడప వలయు
విజయు డిమ్ము దప్పి విరటుని గొల్వడా
విశ్వదాభిరామ వినురవేమ.

సమయా సమయముల కనిపెట్టి గొప్పవాడైనను అవసరమునకు ఆడంబరములు ప్రదర్శింపపక ఏదో ఒక విధంగా కాలంగడుపవలెను. అర్జునుడంతమహాపరాక్రమ వంతుడు కూడా కాలము కలిసిరాక విరాటుని కొలువులో పేడి రూపముతో బ్రతక లేదా!

75. చిక్కియున్నవేళ సింహంబునైనను
బక్క కుక్క కఱచి బాధపెట్టు
బలమిలేని వేళఁపంతంబు చెల్లదు
విశ్వదాభిరామ వినురవేమ.

బుద్ధిమంతుడు తన ఆరోగ్య పరిస్థితిని కూడ దృష్టియందుంచుకొని, నెలవులను చూచికొనియే తన బలమును చూపవలెను. లేనియెడల అల్పుడు కూడ అతని మదమును అణచును. చాలవరకు ఈ పద్యములన్నియు స్థానబలిమిని, కాలం కలిసివచ్చుటను గూర్చి చెప్పను.

76. లక్ష్మియేలినట్టి లంకాపతి పురమ్ము
పిల్లకోతిపౌజు కొల్లబెట్టెఁ

చేటుకాలమయిన జెరప నల్పులె చాలు
విశ్వదాభిరామ వినురవేమ.

కాలం కలిసి రానపుడు తాడే పామయి కరచును. విధి ఎదురు తిరిగినపుడు లక్ష్మితో కలకలలాడు లంకాపురమును అల్పుడయిన వానరుడు చెరుపకలిగెను.

77. మొదట నాశబెట్టి తుదిలేదుపొమ్మను
పరమ లోభులైన పాపులకును
ఉసురు తప్పకంటు నుండేలు దెబ్బగా
విశ్వదాభిరామ వినురవేమ.

వాగ్దాన భంగము కావించిన వాని శవమును కుక్కలు కూడ ముట్టవు. నిరాశ చెందినవారి శాపము ఉండేలు దెబ్బవంటిది. దానమిచ్చు ఉద్దేశ్యము లేనపుడు వాగ్దానము చేయకూడదు.

78. ఇచ్చువాని యొద్ద నీనివాడుండెనా
చచ్చుగాని యీవి సాగనీడు
కల్పతరువు క్రింద గచ్చపొదున్నట్లు
విశ్వదాభిరామ వినురవేమ.

లోభివాని దగ్గర దాతయున్నను అతని దాతృత్వము సాగదు. కల్పవృక్షము నావరించి ముండ్లపొద యున్న జనులు కల్పవృక్షము చెంత చేరరు.

79. అరయ నాస్తియనక యడ్డుమాటాడక
తట్టుపడక మదిని దన్నుకొనక
తనది గాదనుకొని తాబెట్టునదె పెట్టు
విశ్వదాభిరామ వినురవేమ.

ఏ దానమన్న విశేష ఫలమియ్యవలెనన్న యాచకుని కోర్కెను తక్షణమే తీర్చుట.

80. ధనముగూడఁ బెట్టి దానంబు చేయక
తాను ఁదినక లెస్స దాచుకొనగ
తేనెనీగ కూర్చి తెరువర కియ్యదా

విశ్వదాభిరామ వినురవేమ.

తేనెటీగలు తేనె కూడ బెట్టి పరుల కిచ్చినట్లు ఇతరులకు దానము చేయక తాను తినక కూడబెట్టినవాడు లోభియనిపించుకొనును. ఇలాటి పద్యమే సుమతీ శతక ములో కూడ కలదు.

81. కొంకణంబుపోవ( గుక్క సింహముగాదు
కాశికరుగ( బంది గజముకాదు
వేరుజాతి వాడు విప్రుండు కాలేడు
విశ్వదాభిరామ వినురవేమ.

బ్రాహ్మణుడన్న బ్రహ్మజ్ఞానము కలవాడు. కాని ఇతరుడుకాడు. వేరు వేరు చోట్ల తిరిగి నా మనుజుడు తన స్వభావము (నైజము) మార్చుకోలేడు.

82. తవిటి కరయ వోవ దండులంబులగంప
శ్వాసమాక్రమించు సామ్యమగును
వైశ్యవరుని సొమ్ము వసుధ నీచుల పాలు
విశ్వదాభిరామ వినురవేమ.

తనకున్న దానితో తృప్తిపడక వేరు వేరు లాభములకాశపడువాడు వున్నది కూడ పోగొట్టుకొనును.

83. దాతకానివాని దరచుగా వేడిన
వాడు దాత యౌనె వసుధలోన
అవురు దర్భయౌనె యబ్ధిలోముంచిన
విశ్వదాభిరామ వినురవేమ.

దాతకాని వానిని ఎన్నిసార్లు వేడిననూ, సముద్రజలములో ముంచిన ఎండుగడ్డి ధర్భ కానట్లే, ఫలమును పొందజాలడు.

84. పరగ జాతిగుండు బగులగొట్టగ వచ్చు
గొండలన్ని పిండి గొట్టవచ్చు
కఠిన చిత్తు మనసు కరిగింపగారాదు
విశ్వదాభిరామ వినురవేమ.

85. వంపుకఱ్ఱ గాల్చి వంపు దీర్చగవచ్చు
గొండలన్ని పిండి గొట్టవచ్చు
గఠినచిత్తు మనసు కరిగింపగారాదు
విశ్వదాభిరామ వినురవేమ.

ఎన్ని అసాధ్యములయిన పనులనయిన (ఇసకనుంచి నూనెను తీయుట, కొండను పిండి గొట్టుట, రాయిని అరుగదీయుట, వంపుకఱ్ఱ వంపుతీయుట) చేయవచ్చును కాని 'కఠిన చిత్తుని మనసు' కరిగింపలేము. మూర్ఖుని తెలివిగల వానిగ చేయ లేము.

86. విత్తముగలవాని వీపున బుండైన
వసుధలోనఁజాల వార్త కెక్కు
బేదవానియింట బెండ్లైన నెఱుగరు
విశ్వదాభిరామ వినురవేమ.

దనవంతుని ఇంట ఏ చిన్న కార్యము జరిగినను బహుళప్రచారము పొందును. పేద వాని ఇంట పెద్దకార్యములకు కూడ ప్రచారము లభింపదు.

87. మగనికాలమందు మగువ కష్టించిన
సుతుల కాలమందు సుఖమునొందుఁ
గలిమి లేమి రెండుఁగల వెంతవారికి
విశ్వదాభిరామ వినురవేమ.

మగనికాలము స్త్రీ కష్టపడిన కొడుకు కాలములో సుఖపడవచ్చును. కలిమి లేములు కావడికుండలని ఒకదాని వెనక ఒకటి వచ్చుచుండునని సుఖములో పొంగిపోక దుఃఖములో కుంగిపోని వాడే ధీరోదాత్తుడు.

88. తనకులేని నాడు దైవంబు దూరును
దనకుఁ గలిగెనేని దైవమేల
తనకు దైవమునకుఁదగులాట మెట్టిదో?
విశ్వదాభిరామ వినురవేమ.

మానవునకు దేవునకు కలుగు సంబంధము ఎట్టిదో ? సుఖపడుకాలమున అంత యూ తన మహిమేనని, కష్టపడునపుడు నీదే భారమను మనుజుడు ఎంత నికృష్టుడో కదా !

89. గాజు కుప్పెలోనఁ గదలక దీపంబ
దెట్టులుండు జ్ఞాన మట్టులుండు
తెలిసినట్టి వారి దేహంబులందున
విశ్వదాభిరామ వినురవేమ.

పరమాత్మ స్వరూపమును తెలిసికొన్న వారి జ్ఞానదీపము వారినే గాక వారి నాశ్రయించిన వారిని కూడ మోక్షపదమును చేర్చును.

90. అంతరంగమందు నపరాధములు చేసి
మంచి వానివలెనె మనుజుడుండు
ఇతరులెఱుగకున్న నీశ్వరుడెఱుగడా?
విశ్వదాభిరామ వినురవేమ.

మనుజుడు తనలోని భావములను ఎన్ని దాచుకొన్నను సర్వాంతర్యామియయిన భగవంతుని ముందు దాచలేడు కదా !

91. చదివి చదివి కొంత చదువంగ చదువంగ
చదువు చదివి యింకఁ జదువు చదివి
చదువు మర్మములను చదువలేడయ్యెను
విశ్వదాభిరామ వినురవేమ.

ఎన్ని చదువులు చదివి, ఎంత విద్యలు నేర్చినా ఆత్మతత్త్వము తెలియని మనుజుడు మూర్ఖుడే కదా !

92. జననమరణములకు సర్వస్వతంత్రుండు కాఁడు
మొదటఁగర్తకాఁడే తుదనుకాఁదు
నడుమఁగర్తననుట నగుబాటు కాదొకా
విశ్వదాభిరామ వినురవేమ.

మూర్ఖుడు తన జనన మరణములకు అన్నింటికి తానే కర్తయని విర్రవీగును. సుబుద్ధి ఆత్మతత్త్వమును తెలిసికోగలిగియుండును.

93. నీటిలోని వ్రాత నిలువక యున్నట్లు
పాటిజగతిలేదు పరములేదు
మాటిమాటికెల్ల మారును మూర్ఖుండు
విశ్వదాభిరామ వినురవేమ.

మూర్ఖుని స్వభావము మాటిమాటికి మారిపోతూవుంటుంది. అది నీటిమీద వ్రాతవలె విలువలేనిది.

94. తల్లియున్నయపుడె తనదు గారాబము
లామె పోవఁదన్ను నరయరెవరు
మంచికాలమపుడె మర్యాదనార్జింపు
విశ్వదాభిరామ వినురవేమ.

కాలం కలిసి వచ్చినపుడే గౌరవ మర్యాదలు ఆర్జించుకోవలెను. లేనపుడు ఎందుకూ కొరగారు. అది ఎట్లన తల్లి బ్రతికియున్నప్పుడే గారము సాగినట్లు.

95. మాటలాడవచ్చు మనసుదెల్పఁగలేడు
తెలుపవచ్చుఁదన్ను తెలియలేడు
సురియబట్టవచ్చు శూరుడు కాలేడు

విశ్వదాభిరామ వినురవేమ.

మనసెరిగి మాటలాడు వాడే నేర్పరి. కత్తిపట్టిన వాడంతా శూరుడుకానట్లే అందరూ నేర్పరులుకాలేరు.

96. శాంతమె జనులను జయమునొందించును
శాంతముననె గురుని జాడ తెలియు
శాంత భావమహిమ జర్చించలేమయా
విశ్వదాభిరామ వినురవేమ!

శాంతము యొక్క గొప్పదనము ఇంతింతనరానిది. శాంతముతో సాధించరానిది లేదు.

97. ఆడితప్పువారలభిమాన హీనులు
గోడెఱుఁగని కొద్దివారు
కూడి కీడు సేయఁగ్రూరుండు తలపోయు
విశ్వదాభిరామ వినురవేమ.

క్రూరులు మంచివారిలా కన్పిస్తారు. ఆత్మాభిమానము వదిలి, మంచి చెడ్డయనక అబద్ధాలతో బ్రతుకుతారు. కూరాత్ముల స్వభావము నెవరును మెచ్చుకొనలేరు.

98. తఱచు కల్లలాడు ధరణీశులిండ్లలో
వేళవేళ లక్ష్మి వెడలిపోవు
నోటికుండలోన నుండునా నీరంబు
విశ్వదాభిరామ వినురవేమ.

అబద్ధాలాడితే రాజులైనా సరే వారి యిండ్లలో సంపద నశించిపోవును. చిల్లికుండలో నీరు నిలవనట్లే అసత్యమునకు విలువయుండదు. కాబట్టి అసత్యాలు ఆడరాదు. అవి ఎలాగో బయటపడతాయి.

99. చంపగూడదెట్టి జంతువునైనను
చంపవలయు లోక శత్రుగుణము
తేలుకొండిఁగొట్టందే లేమి చేయురా
విశ్వదాభిరామ వినురవేమ.

మనుము ఏ క్రూరజంతువును చంపరాదు. ఈ లోకములో హింసాప్రవృత్తిని, చెడు బుద్ధిని వదిలివేయాలి. తేలుకొండిను తీసివేస్తే తేలునుంచి ఎటువంటి హాని కలుగదు.

100. ఆత్మయందె దృష్టి ననువగా నొనరించి
నిశ్చలముగా దృష్టి నిలిపెనేని
అతడునీవె సుమ్మి యనుమానమేలరా
విశ్వదాభిరామ వినురవేమ.

మనస్సులోనే ఆత్మను అచంచల ఏకాగ్రతతో ధర్శించిన మోక్షమును పొందవచ్చు. గురూపదేశము వలనే ఇది సాధ్యము.

హింసా ప్రవృత్తిని తొలగించిన ప్రపంచమంతయు శాంతితో నిండియుండును. We have to remove terrorist attitude but not terrorists. మోక్షమును పొందుటకు ఏకాగ్రత పెంపొందించుకొనవలెను. అది గురూపదేశమువలననే సాధ్యము. 'విశ్వధాభిరామ, వినురవేమ అను మకుటంలోనే వేమన తన విశ్వదృష్టిని చూపించాడు. తాను విశ్వమంతా వ్యాపించినవాడట. అంటే తాను చెప్పిన నీతులు వర్తించనివారు ఎవరూ లేరని, మూర్ఖులను, సుబుద్ధులను, హీనులను, గుణగరిష్టులను, రాజులను, పేదలను, స్థానబలిమి గలవారిని, లేనివారిని అందరినీ, అన్నివిధాల తట్టిలేపి, చిట్టచివరికి గురువే అందరినీ దరి జేర్చువాడని దైవమును చూపించువాడని చెప్పిన ధీమంతుడు.